# ప రి చ య ము

మృదుపదలలితమును, సనాతనాధునాతనభావమిళిత మును, విశుద్ధధారాకలితమును నయి యలరారుచున్న 'నెచ్చెలి' సహృదయబృందమునకు నెచ్చెలియే యగును. కవికిం బ్రబోధకారణమును, నన్వేషణాఫలితమును నీ నెచ్చెలియ. ఈ యద్భుతాకారయగు నెచ్చెలిని నన్వేషించు కవి భావమూర్తి. అసదృశమగు తన యూహాబలంబున నీయకుంఠితాన్వేషణమునం గవి తెక్కలంగాంచు మహాభాగ్యము నార్జించెను. తన యూహాలకు తెక్కలుగట్టి యెగిరింపంజాలు నీ కవికే యా యూహములు తెక్కలనొసంగి ధ్యేయానప్రాప్తి నొడంగూర్చెననుట సమంజసము. ఆ తెక్కలపైం దాం దేలుటయెకాక, కవి పాఠకోత్తములనుగూడం దేల్పంజాలెను.

అనుపమానమగు నిజహృదయావేగముతోడను, నద్వితీయమగు స్వాంతవిస్ఫురణముతోడను గవి యొనరించిన యీ మహాన్వేషణమున సర్వమతములును సమత్వము నందెననుట మహాగభీరభావభరితమని విమర్శకవరేణ్యు లంగీకరింపంగలరు. నెనుకుటలో మూర్తిత్రయంబు కరంగి ముద్దయయ్యెను. మహాప్రకృతి మహేశ్వరునితో వియ్యమందెను. దశదిశావ్యాప్తమగు వైవిధ్యమంతయు నేకత్వశోభను బెంపొందెను. అయ్యదియే ముమ్మొనసెలుగకు మూలదండము.

అద్దియే శ్రీపతి మైక్యానుసంధానము. ఇంత మహోత్కృష్ట భావసంపద నింత పిన్నవయస్సునఁ గాంచఁగలిగిన యీ కవి కడుంగడు ధన్యుఁ డనకతప్పదు.

భావప్రవాహవేగంబున నూరక కొట్టుకొనిపోవువాఁడు గాక కవి కడు జాగరూకుఁడు, విమర్శనదక్షుఁడును. మనఃకాండపటంబున నుద్రిక్తభావనయనంబులకుఁ గన్పట్టుచుండిన పటనాటకమునఁ దాను పాత్రయుఁ బ్రేక్షకుండును నయియుండుట నేమరని ప్రజ్ఞావంతుఁడు. కావుననే నెచ్చెలి యాకాశపథమున నేగు నంబుదంబువలె నందరానియందము గాక గగనవిహారచణమగు గాలిపటమువలె 'క్షోదక్షమ' మయి యానందదాయక మగుచున్నది.

అపారపాండిత్యమున నాంధ్రలోక ప్రశంసలనంది యశశ్శరీరులయిన శొంఠిభద్రాద్రి రామశాస్త్రిగారి కుమారులగు శ్రీపతి శాస్త్రిగారిట్టియమోఘ కావ్యమును రచించుట సర్వవిధముల సమంజసము. ఇట్టి గ్రంథరాజములనింకను గొన్నిటిని రచించి శ్రీపతిశాస్త్రిగారు మాతృభాషాయోషామణినలంకరింతురని శ్రద్ధయునమ్ముచు, బరిచయవాక్యరచనావ్యాజమున నెచ్చెలితోఁ సహనాభావభాగ్యము నందినందులకు మహామోదమును బొందుచున్నాఁడను.

చెన్నపురము }
15-2-32 }

గోపీ శర్మరావు.

# FOREWORD

I have gladly consented to contribute a foreword to this charming poem, though I am not convinced that it is proper to do it in English. Mr. Sripati Sastri is a poet by heredity and early training. The scholars of the 17th and 18th centuries built up the southern school of Telugu literature in far-off Madura and Tanjore. Like them Mr. Sastri is worshipping the Telugu Muse in the heart of the Tamil land. They did their literary work in a congenial atmosphere, under the patronage of the cultured Nayak Princes; Mr. Sastri has only his innate love of learning to urge him on.

In NETCHELI, 'The beloved', Mr. Sastri transports us to the realm of dream and fantasy. With rare felicity of diction, he narrates his journeyings through that realm, floating on the wings of fancy and imagination. The quest for the Beloved, the yearning for that which 'passeth understanding', is the central theme of the poem. Out of the twilights and shadows, the doubt and despair, emerges a joyous note of triumph. To the lover of poetry no less than to the philosopher, this poem is of value. May it start others on the Great Quest, and lead them to the shore of the Eternal, even as it has led this pilgrim-poet!.

Madras,
15—2—1932.

K. RAMAKOTISWARA RAO,
Editor, 'Triveni'

*

*　　*

*　　*　　*

ఈ చిన్నిపొత్త మావృతిఁ జిత్తగించు
చదువరుల విశాలహృదయవీథులను
సంచరించుచు రహించు "నెచ్చెలి"కిఁ
గృతి యొసంగితి......శొంఠి శ్రీపతిశాస్త్రి.

*　　*　　*

*　　*

*

౧

## —: క ల వ రిం త :—

*

*　　*

*　　*　　*

“ ఆదితేజోమూర్తి !- ఆలింగనంబు !-

“ ఆశ్రితావనమూర్తి !- ఆనందనంబు !-

“ ఆగమాంచితమూర్తి !- ఆదరణంబు !-

“ ఆనందమయమూర్తి !- ఆత్మార్పణంబు !-

*　　*　　*

*　　*

*

౨

—: మే లు కో లు :—

*

*　　　*

*　　　*　　　*

ఊఁ!_ఊఁ!_ఎవరు?_ఏమి?_ఊఁ!-ఎందుకో అను?_”
లేదు లేదు_ఇదిగో, లేచుచున్నాను-
అరమోడ్పుఁ గన్నులా ?- ఔనౌను_ కాదు_
మెలఁకువ యున్నది_ తెలివి వచ్చినది-

*　　　*　　　*

*　　　*

*

## 3

### —: వెదకులాట :—

♦ ♦ ♦

లేచి కూర్చుంటిని - లే రెవ్వా రెదుట !-
నను మేలుకొలిపియు, నామ్రోల లేక
యేమూలనే, నెవ్వరే, డాఁగికొనిరో ?-
కలయఁ జూచెదను నల్గడల ? _ శూన్యంబు-
చిఱుచీఁకటింటను జిన్నదీపంబు
మినుకుమినుకుమని కునుకుచు నుండె-
దోమతెర వెనుకఁ దోఁచెడు నేమొ ?-
తెరకంబముల నీడ తెలియఁగా నయ్యె-
జీతబత్తెంబులు నేకరింపకయె
సేవాప్రమత్తుఁడౌ కావలీఁడు వలె
గడియార మదె నడివడిఁ గొట్టికొనుచుఁ
గాలగమనసూచకధ్వని సలుపు;
(టికుటకు టికుటకు - టింగు - టికుటకు)
ఒంటిగం టైనదే ! - ఊరకే యిట్టు
లీయర్ధరాత్రి నే నేల లేచితిని ?-
లేపినవారు తెలియఁబడ రయ్యె-

ఈ గవాక్షముపొంత నెవ రేనిఁ గలరొ ?
ఎంతగాఁ బరికింతు ? — ఎవరును లేరు—

♦ ♦ ♦

పెరటితోఁటను బండువెన్నెలలోన
నెరయ విరిసిన రాతిరిరాణి మేని
కమ్మనెత్తావినగల దొంగిలించి,
ఆకుఁగదలికల యలికిడి కదలి,
చల్లఁగా మెల్లఁగాఁ బిల్లగాడుపులు
కిటికీకటకటాలఁ దటుకునఁ జొచ్చి,
—తమ కెకిమీఁదు గాఁదగు వలరాజు
వలదోమతెరకు లోపల నక్కుఁ బోలు—
కొల్లసొమ్మతనికిఁ గొని కాన్క లిడఁగ
వలసందులం దొక్కనడి దూఱుచుండె—

♦ ♦ ♦

నా మేలుకోలున కేమి కారణమొ
తెలిసిగాని మదికి నిలుకడ రాదు—
మూలమూలల కెల్లఁ బోయి చూచెదను—
తలదిండుక్రిందను దాఁపఁగాఁ బడిన
చేదివ్వెతోఁ బరీక్షింతును గాక—
ఈ మూల ? — శూన్యంబు — ఇచట ? — హుళిక్కి—

ఈ ప్రక్కనో ? – ఉఁహుఁ, ఎవరును లేరు–
దైనందినగృహకృత్యపరికరంబు
లమరిచిన వమర్చి నట్టులే యుండె–

♦ ♦ ♦

చీమ చిటుకు మన్నఁ జెచ్చెర లేచి
నలువంక లరసెడు నాతల్లి గూడ
నిశ్చలంబుగ నిట నిద్రించు చుండె–
ఏ గోడు లేకుండ నింట నెల్లరును
నిదురించు చుండఁగా నిది యేమివింత,
యే నొక్కరుఁడ మాత్ర మెట్లు మేల్కాంటి ?–
మేలుకొల్పెదఁ దల్లి నాలుబిడ్డలను ;
వీరును నాయట్లె వెదకి వ్యర్థముగ,
' నిదురలో నదిరిపా టిది ' యనియెదరు.
న న్నెవ్వరో లేపినా రంతెకాని
నేన మేల్కాన లేదు; నిస్సంశయ మిది–

♦ ♦ ♦

నన్ను లేపిన వ్యక్తి నాకన్నుమొఱఁగి
తెరువులో నైనను, బెరటిలో నైన
డాఁగ నేగెనో యేమొ, వేగ సాగెదను–
ఇట్లు భ్రమపడుట కెడము లేకుండఁ

బ్రతికవాటము లోన బంధింపఁబడియె ;
దొంగ లెవ్వరు నింట దూఱనే లేదు-

♦ ♦ ♦

ఆఁ ! అన్నటులు ! 'దొంగ' లనునంత మదికి
శయనమందిరగవాక్షములోఁ జొరఁబడు
గాలిదొంగలఁ గూర్చి జ్ఞాపకం బయ్యె-
తోఁటలోనుండి యేదో యొకవ్యక్తి
నను బిల్చి యుండనోఁ ; గనుఁగొందుఁ గాక-

♦ ♦ ♦

తలుపుగడియలను మెలమెల్లఁ దీసి
గృహపరిసరవనం బిదె చేరుకొనఁగఁ-
గనుపండు వైన చక్కనగు దృశ్యంబు ;
మెయిఁ బులకించు సమీరస్పర్శనము ;
ఘ్రాణరంజక మగు కమ్మనెత్తావి ;
విన విందుగూర్చు నిస్స్వనవిశేషంబు ;-
ఈదృశాహ్లాద్య ప్రకృతివిలాసమున
భావంబు లీనమై ప్రకృతంబు మఱవ,
నప్రయత్నముగ నాయంగుష్ఠమునకుఁ
జేదివ్వెలో నమర్చినగుండు దాఁకి
విద్యుత్ప్రదీప్తమై వృక్షలతాళి

మెఱుఁగుఁదీవియతోఁడి మేఘమో యనఁగ
భ్రాంతిగొల్పెఁ ; బిదపఁ బ్రకృతంబు దోఁచె-

♦ ♦ ♦

చేదివ్వె వెలుఁగు లక్షించి యెడనెడ
వెదకెద నన్ను లేపిన వ్యక్తికొఱకు-
ఇదిగొ రాతిరిరాణి - ఇదె గవాక్షంబు-
ఇద్దిగో జలయంత్ర - మిదె పొన్నగున్న-
పార్శ్వమందున నిదె పలకఱాతిన్నె-
ఈ వంక ? - ఆవంక ? - ఏవంకఁ గనిన
మల్లెతీవలుఁ, బిల్లమావులే గాని,
యితరవృక్షము, లింక నేమేమొ గాని,
వలసినయట్టి జాడలు గానరావు-
నా వెదకికొనుటయే వృథాయయ్యె ;
విరమించి యింటఁ బ్రవేశింతుఁ గాక-
ఉఁహుఁ - కొంచెమును మన సొప్పుటలేదు-

♦ ♦ ♦

పలకఱాతిన్నెక్రేవలఁ బొన్నచెలువ
సితపుష్పనఖసమంచితరమ్యరాగ
కోమలపల్లవాంగుళులను వీచి,
" ఎడఁదలోఁ దడఁబాటు విడఁ గొంతసేపు

"విశ్రాంతి నొందు మీ వేదికపైన ;
"ఉపచార మొనరింతు నొక్కింత" యనుచు
సైగ సేయుచు నుండె, సమ్మతించెదను-

♦ ♦ ♦

ఏటవాలుగ నున్న యీ తిన్నెగట్టు
పడుకకుర్చీవలె వాటమై యుంట
వెన్ను మోపఁగఁ గొంత విశ్రాంతి యొసఁగ-
హాయి హాయి! మహత్తరానందమయము!

♦ ♦ ♦

పొన్న ముత్తైదువా! పుణ్యాత్మురాల!
అలసిపోయిన నాకు స్వాగతం బిచ్చి
విరిసురటీలతో విసరుటే చాలు ;
వెదకులాడెడు నాకు విసుగు వోఁబుచ్చి
యుపచారశబ్దంబు లూఁదుటే చాలు ;
నెలవంకపొన్నగిన్నెఁ గల పన్నీరు
చేకొని నాపైనఁ జిలుకుటే చాలు ;
ఇంక నేమొ సపర్య కుంకితు వేల ?
నీ యాదరమున సంతృప్తుండనైతి ;
ఇప్పటికే నీకు నే నప్పు వడితి ;
నీ పాదసన్నిధి నేఁ జేతులార

బోదిపల్లెమున నప్పులు ధారవోసి
ఋణవిముక్తుండ నయ్యెద రేపకడనె—

♦ ♦ ♦

ఓ పౌర్ణముత్తైదువా! పుణ్యవతివి;
నీ యకారణకారుణికత కేమందు?
శ్రీశుభావహాసదాశీర్వధకముగఁ
జివురుకెంగేలను బువుగోటికొనలఁ
బసపుఁబుప్పొడిసేసబ్రాల్సేకరించి
నామీఁదఁ జల్లెద వేమికారణము?
ఏ శుభంబుకొఱకు నుద్దేశించినావు?
ఎట్టి కళ్యాణమూహించి యున్నావు?
ఈ విఫలాన్వేషి కెటులౌను శుభము?—
ముక్కుమూలము లేక, మూర్ఖుండు వోలె
వట్టి వైలనుకోక, గట్టిగా నమ్మి
యిదమిద్ధమని లేకయే వెదకునది
సాధకంబైనను బాధకంబైన
నీ పున్నమునఁ జేసి చేపడునెడల,
నిప్పటి యావేగమే పోవునెడల,
నాకదే పెండ్లియంతటి పెద్దశుభము;
పెండ్లియంతటిదేల? పెండ్లియే గాన

నే నిందుఁ జేపట్టు నెచ్చెలి యెవరో ?-

◆ ◆ ◆

చిఱుమంచు తడియాఱ నెఱపఁగాఁబడిన
వెన్నెలపిండికై విసువీధి నెగురు
రిక్కపిట్టలు డగ్గఱిలనీక కాచు
జాబిల్లికాపరి జాగరూకుఁడయి ;
ఎవరి యాజ్ఞల నిర్వహించు చున్నాఁడొ ?-

◆ ◆ ◆

వనకాంత గట్టిన పసిమిచేలమున
నందందుఁ గనువిందు గ్రందుకొల్పుచును
జిగురాకుజిగినీలు ధగధగలాడు;
నవపుష్పరత్నసంతతి రంగులీను;
శాఖావళు లురోవిశాలతం దెలుపు;
గుబ్బయుబ్బులు పండుగుత్తులం జాటు;
ఔరౌర ! యీరీతి నన్నివిధములఁ
బరిపూర్తి నొంది మై మఱపించు చుండె
నేమి కళాశక్తి ! ఏమి చతురత !-
మానుషహస్తనిర్మాణంబునందుఁ
గృతకతయే గాని, యెంతెంతలైన,
ఈ జీవకళయును, ఈ మనోజ్ఞతయు,

నుట్టిపడంగఁ జేయుటె యసంభవము-
మానుషాతీతకళానిధి యెవరో ?-

♦ ♦ ♦

తన నూత్నపుష్పిణీత్వము సిగ్గుచేత
మఱుఁగుసేసికొనఁ జంపకలతికాంగి
మిసమిస లాడెడు పసరాకుచీర
మేలిముసుం గూనె మిసిమి పెం పెసఁగ-
ఇద్ది కేవల మమాయికతయే కాని,
నవనవావాప్తపుష్పవతీనిసర్గ
భావితసౌరభ్యబాహ్యచిహ్నములు
చాటవే యీ రహస్య ? మిది యెఱింగి
వెనుక వెన్కలఁ జేరి యనిలనాయకుఁడు
కిచకిచ నవ్వించి గిలిగింత లిడుచుఁ
గౌఁగిలించెడు నామె మై గగుర్పొడువ ;-
ఇందు సంధానకర్తృత్వ మెవ్వరిదో ?-

♦ ♦ ♦

ఎలమావికొమ్మ యుయ్యేల నూఁపుచుండ
నిదురలోఁ గలవరించిన కోకిల మదె,
దిగ్గున మేల్కాంచి దిక్కు లారయుచు,
కువకువ మను చెందుకోసమొకాని

పఱతెంచు చుండె నంబరవీథిలోన ;
అన్వేషణావేగ మై యుండనోపుఁ ;-
దదపేక్షితవిషయ మెదియొ నే నెఱుఁగ ;-
వెదకులాడఁబడున దెదురైన యట్టు
లింతలోఁ గోకిల మేకధోరణిగ
కువకువధ్వనిమాని కూకూప్లుతముల
సంగీతసరణిని సమ్మేళపఱచి
తనివితీఱఁగఁ బాడి తనతావుఁ జేరె-
కోకిల కానంద మే కతంబుననో ?-

♦ ♦ ♦

ఇదియేమి ?- వనమెల్ల నింతలోపలనె
రేచీఁకటులు గ్రమ్మెఁ జూచుఁచుండఁగనె ?-
కనఁబడు తెలియంచు కఱిమబ్బు తునుక
వెనుక మఱుఁగువడె వెన్నెలఱేఁడు
ఇప్పు డాకసము నాహృదయ మట్లుండె ;
మొలకువ కతమేమొ తెలివిడి గాక
ప్రబలసంశయము కార్మబ్బులా గుండఁ
దెలిమబ్బు లేసులువలెఁ జుట్టుకొనియెఁ
బ్రకృతిపరీక్షచేఁ బ్రశ్నాంకురములు-
పోలిక లన్నింటఁ బొసఁగ కుండెనిట.

చదలునఁ గఱిమబ్బుచాటుచందురుని
వెలుఁగుచే మొగులునఁ దెలియంచు దోఁచె ;
ప్రశ్నహేతుకమైన ప్రకృతికారణము
నా సంశయములో మనసులో నెటుండు ?-
చీఁకటి వోఁబుచ్చి యాకాశమందు
మబ్బువిడినఁ జందమామ దోఁచు గతి
నావేగ ముడిపి నా యంతరంగమున
సంశయరహిత ప్రసన్నతతోడ
సాక్షాత్కరించు పర్యవసాన మేమి ?-

*　　　　*　　　　*

*　　　　*

*

*

*　　　　*

*　　　　*　　　　*

“ ఏల వృథాయాస ? మేల తత్తఱము ?
ఏల యీ మీమాంస ? ఏల తార్కికత ?
నీ సందియమునకు నీ ప్రశ్నలకును
సద్యస్సమాధానసమవాప్తి కొఱకు
నెంతచూచినను బహిరగోచరంబు ;
వ్యర్థచక్షుఃపరీక్షార్థివి గాక
సదమలశాంతప్రసన్నాత్ముఁడ వగు ”
మనుచు మిగుల నన్ననునయించునట్లు
నిద్దుర కనుచూడ్కి నిగుడింపనీక
బలవంతపఱచి ఱెప్పల వ్రాల్చుచుండె.-

*　　　　*　　　　*

*　　　　*

*

౪

## —: నిదుర లేమి :—

♦ ♦ ♦

నిద్రాధికారిణీ! నీ నిరంకుశత
కేమందు? నిర్మలతామసవేళ
నీ యేలుఁబడి సెల్లు నిర్నిరోధముగ ;
నిను విరోధించుచో నీవు సాధించి,
భద్రాధికారునిపై దాడివెడలి,
యావులింతల మ్రింగునటు విజృంభించి,
నిర్వహింపఁగఁ జేసి నీ శాసనంబు,
నారోగ్యదండశాస్త్రానుసారముగ
నుచితశిక్షలకుఁ బా లొనరింతు గాదె?-
సాఁగంటికునుకునఁ దూఁగుపా టరయ
నీ యేలుఁబడినేల నీ వైరినేల
విడఁదీయు నడుమ నేర్పడు పొలిమేర-

♦ ♦ ♦

నీ కటాక్షములేక నా కెన్నొమాఱు
లగణితబహుదీర్ఘయామినుల్ గడచెఁ ;
గనుదోయి మూసికొన్నను జాలిపడవు ;

నిరపేక్షితవె యయ్యు నీవు నన్నిపుడు
సాధింప జతనంబు సలుపుటే వింత !-
నేఁటిరాతిరిగూడ నీ తిరస్కృతిని
దొలిసగంబు సనె నెంతో విచిత్రముగ ;
అప్పటి నా స్థితి యభివర్ణ్యముగద ?-

♦ ♦ ♦

తనువిచిత్ర ప్రదర్శనశాలయందు
నెలకొన్న మానసనేపథ్యముపయిఁ
జేతనసహితవిశేషచిత్రముల
బింబితంబు లగుచు వివిధరూపంబు
లొక్కటొక్కటిగ రసోచితరీతి
నాటకపాత్రాభినయమును మించి
యింపునింపుచు నిష్క్రమింపఁగా సాగ-
తత్ప్రదర్శనమున స్థాయిభావంబు
నేనె యనుభవించినా ; నట్టులయ్యుఁ,
గనుమూసికొనియుఁ బ్రేక్షకుఁడ నౌ టెటులో,
ఆ బొమ్మలాడించు యంత్ర మెయ్యదియొ,
విద్యుత్ప్రదర్శకతోద్యోగి యెవరో,
నిర్ణయ మొనరింప నే నశక్తుఁడను.-

♦ ♦ ♦

వఱుసగా నొకకథ పగిదిగా కదియు
వ్యవధియుండని బొమ్మలాటగాఁ దోఁచె ;
నొకపాత్రధారి నై యుంటి నే సందః-
ప్రేక్షకపాత్రధారిత్వంబు లొకట
నడిపించు నిపుణుఁ డా నాయకుఁ డెవరో ?

చుట్టుపక్కంబులు చూపట్టినారు ;
అపరిచితులతో సలిపితిని జెలిమి ;
మోసపోయితి సహవాసులచేత ;
ఉన్నతోద్యోగుల యొత్తిడివలన
నాచేత నగు రవంత యధికారమును
జేక్రిందివారిపైఁ జెల్లించుకొంటి ;
స్వజనంబుమ్రోల సాంసారికవిషయ
మొకకొంత నడచె వేఱొకబొమ్మలోన ;
జలగామిలోఁ దేలి సలిపితి యాత్ర ;
వాయువిమానంబుపై నెగిరితిని ;
ఓ ! తలపోయ నెన్నోవిచిత్రములు !-

♦ ♦ ♦

ఒకబొమ్మవెనుక నింకొకటిగాఁ గడచి
తుదకొక్క చక్కని తోఁటలో నుంటి ;
అందలి వృక్షంబు, లందలితీవ

లందలి పూఁబోద లందలి మొలక
లందలి పలువింత, లందలి సొబగు,
లచ్చముగఁ దలంప నలవిగా దిపుడు-
ఆ తోఁటలో నొక స్వచ్ఛాంబుసరసి
యొడ్డునఁ గూర్చుంటి నూరించు వేడ్క.

♦ ♦ ♦

కలువ ప్రావిరులు రేకుల మోడ్చునంతఁ
దమ్మి క్రొమ్మొగడలు దళముల విచ్చె ;-
గ్రుడ్లు మిడుకరించుకొనె గూబ ; లంతఁ
దేటిపాఱఁగఁజూచెఁ గీరశారికలు ;-
ఉదయాచలము తెలివొందినయంతఁ
గునుకుఁగొండ వహించెఁ గొంత తామసము ;-
క్రమసుశిక్షితసైనికసమితివోలె
సామరస్యముగ సజాతీయములుగఁ
బక్కిపిండులు చేరి బారులుదీటి
గగనరంగంబున నెగురగాఁ జొచ్చె-

♦ ♦ ♦

కొలఁకుఁ గెలఁకులకుఁ గులుకులు దొలఁక
నాళీకములతోఁ బెనఁగులాడుకొనఁగ
నలసయానంబుల నంచ లేతెంచి

పద్మరాగము జలప్రతిబింబితమగు
దివ్యప్రభాతరక్తిమతోడఁ గలిసి
యేర్పాటు లేకొకేమెఱుపుగా నుంట
నీరేజములజాడ నిర్ణయింపడక
జలములఁ నీఁదాడ సంకోచపడుచు
సరసి ప్రదక్షిణచకితేక్షణముల
ముక్కుల నొండొంటఁ బొడిపించికొనుచు
నడవడి తడఁబడఁ జిడిముడి పడియె-
చిలుకలు గోరువంకలుఁ గూడిమాడి
సరససల్లాపముల్ దొరకించికొనఁగఁ
గోకిలం బొకచోట నేకాకిని యయి
యాలపించెను రాగ మానంద మొదవ-
నే నప్పు డోరువలేనివానివలె
నెలుఁగెత్తి యిట్లు కేకలు వెట్టినాను-

♦ ♦ ♦

" కీరద్విజములార ! నోరునొవ్వంగ
మీ రెంతపలికిన సారంబు సున్న ;
'అందుకు సందేహమా' ? లేదు లేదు
'చిలుకపలుకు' లనిచెప్ప టెందులకె-
ఓ కలకంఠీ ! వృథాకంఠశోష

యే కాని నీరాగ మెంతపాడినను
వ్యర్థమగుచు క్షణికానంద మొసఁగి
గతివిభేదము లేని యతిధోరణియయి
వినవినఁగఁ దుదకు విసుగుపుట్టించు
పిట్టకూఁతయ గాని పృథుగీతి గాదు ;-
పలికినపలుకులే పలుకును జిలుక,
పాడినపాటనే పాడుఁ గోకిలము ;
పలుకాడు చిలుకకుఁ బాడుట రాదు,
పాడు కోయిలకు మాటాడుట రాదు,
మిమ్ము నే నీ రెంట మించి పోఁగలను ;
పలుకాడఁగలను ; పాటలఁ బాడఁగలను ;
పలుకుపాటలఁ జేర్చి పలికింపఁగలను "-

♦ ♦ ♦

" తేటయౌ తీతీపు తెనుఁగుఁ దేనెయును,
సారమధుమధురసంస్కృతామృతము,
సేకరించుచు యథోచితరీతిగాఁగ,
నాత్మసూత్రవిలంబనాంచితమైన
బుద్ధితులాదండమున వ్రేలుచున్న
యెడఁద తక్కెడలోన నిడి తూఁచికొనుచుఁ
బ్రథితశాస్త్రవిధులఁ బాళ్లొనరించి

లెస్సగాఁ గలిపి, తేటిన యాంధ్రరసము
గానానుపానవిలీన మొనర్చి
వీనుదొన్నెల నించి వేచవు లూర
రసికమానసము లుల్లసిలఁ గ్రోలింతు "–
" అంతర్బహిర్బహుళార్థవంతములు,
సుమనోమనోహరసూక్తిమంతములు,
స్వకపోలకల్పితభావవంతములు,
సారగుంఫితచమత్కారవంతములు,
ధ్వన్యలంకరణనిధానంబులైన,
ధీనుతవ్యంగ్యప్రధానంబులైన,
తన్మయానందసంధానంబులైన,
పలుకులు నావి ;- నాపలుకులలోన
రాగసమ్మేళమై రాగంబు వాఁడము ;
లయవిశేషంబుల లయమౌను మనసు ;
నా కవనం బిదే నాకవనంబు "–

♦ ♦ ♦

నాగరవ్వాక్ప్రసంగము నాలకించి
పాప మా పులుఁగులు బదులాడలేదు ;
తమధోరణి నిసుమంతయు వీడలేదు ;
" ఈ వట్టిమెగిరిపా టీపాటి కుడిగి

కడఁగుము సార్థక కార్యంబున ” కని
కొంత వేపటికి నాకు బను లిచ్చినాము
లెలమావి కెంజిగురుల సంగ్రహించి
యెచటికో కోకిల మెగిరిపోయినది-
తగని రోసమున నే నెగురవలె నని
యొక్క గంతిడితి నా యోపినకొలఁది
ఇది వట్టి యెగిరిపా టిది వెఱ్ఱితనము-
ననుఁ జూచి పరిహాసించినయట్టు లపుడు
చిలుకలు గోరువంకలు నొక్కవడిని
గిచకిచ నవ్వి యెగిరిపోయె నెటకొ-

◆ ◆ ◆

“ నా చేతఁగానితనము బైటఁ బడెను ;
మనసుచే నెగురఁగల నెచటికైనఁ ;
దనువుచే నెగుర నాతరము గాదయ్యెఁ ;
బక్కికింబలె నాకె ఱెక్క లున్నయెడ-”
నని యేమొ యోచించికొను చున్నయపుడు
నిద్రాధికారిణీ ! నీ కటాక్షమునఁ
గునుకువట్టినది నాకుఁ దెలియకుండ-

* *
*

౨

—:క ల:—

♦ ♦ ♦

ఆహా ! త్వదీయ రాజ్యాధికారమున
నానంద మొందుదు నైన నిట్టిదని
వివరించుటకు నా కలవిగాదు, నిదుర !
భద్ర రాజ్యంబు లోపలి యున్కి కంటె
తావక రాజ్యమందలి యున్కి మేలు ;
భద్ర రాజ్యమున నాపదలు, సంపదలు,
నంతంబు లేనట్టి యాశాపిపాస—
ఓ! వివరింపలే నొక్కటొక్కటిగ ;
ఈ దృశ్యవ్యామోహమే వెల్లువలుగ
నీదులాడుచు నూరకే కొట్టికొనుచు
నిదె శాశ్వతంబని యెంచు టైపోయె—
ఈ యవస్థలె లేవు నీ యేలుబడిని ;
ఉండిన నుండుగా కొక్కింత సేపె—
భద్ర రాజ్యమున సంభవమగునవియుఁ
దృటికాలమునకు ముందటి విప్పు డరయఁ
గలలోని వృత్తాంతములు వోలెఁ దోఁచు ;

నైన స్వప్నంబె నా యనుభవంబునకు
మిన్నగాఁ దోఁచు ; నేమన్న, స్వప్నమున
నీప్సితంబు లీడేఱుఁ గాదె ?–

◆ ◆ ◆

అటు తావకకటాక్ష మావహిల్లంగ
స్వప్నలోకంబు లోపల నుంటి నేను ;
ఆ సమయమున నా కది కలగాదు–
స్వప్నలోకప్రవేశమునకుఁ బూర్వ
మెచ్చట నుంటినో యెఱుఁగను గాని
సశరీరముగ నుంటి స్వప్నలోకమున.–
స్వప్నవృత్తాంతమే ప్రకృతవిషయము.–

◆ ◆ ◆

తొలుదొల్తనేఁ జొచ్చి నెలకొన్న తావు
సకలశూన్యం బగు నొక పెద్దబయలు ;
నిబిడాంధకారసంకీర్ణ మా బయలు ;
వృక్షాంకురాదివిహీన మా బయలు ;
ప్రాణిసంచారణరహిత మా బయలు–
మన్ను మి న్నేక మై తెన్ను దెలియక
కాలు సేతులు గడగడలాడిపోవ
గ్రుడ్లు పెద్దగఁ జేసికొని మోమునిండఁ,

జూడలే నంతగాఁ జూచితిఁ గాని
నాకుఁ గబోదితనము గల్గెనపుడు.
కాళ్లేతులె కనులుగాఁ గొంతసేపు
క్రీఁగాల నటకేలఁ గ్రిందుముందులను
దడవుకొనుచుఁ గొన్నియడుగుల నిడితి ;
నెటుపోవుచుంటినో, యేమికారణమొ
యెఱుఁగకే యిటునటుఁ దిరుగాడినాను ;
పరుగెత్తినాను ; బొబ్బలు వెట్టినాను ;
ఏవంకఁ జనిన నాకేరీతి నుంట
నున్మత్తనర్తన ముంకించినాను-

◆ ◆ ◆

తెంపున్నవటకీ గతిని బ్రవర్తించి
గొబ్బున నొకచోటఁ గుదికిలఁ గూలి,
చేతోవిభీతినిశ్చేతనుఁడ నయి
వెఱ్ఱిచూపుల వెలవెలఁ బోవుచుండ,
దాదాల నొక్కెడ దేదీప్యమైన
భూగర్భనిర్భేదమూలకంబైన
యుగ్ర తేజఃపుంజ ముద్భూతమయ్యె !-
కనుదోయి మిఱుమిట్లుగొని మూసికొనఁగ
దుర్భరంబయి హాతాచ్ఛ్రితిగతంబయ్యెఁ

గడుపుఁ బ్రేవు లదల్చు గర్జారవంబు ;
కనువిచ్చినంత దిగ్వలయంబు దాఁకఁ
దెలివెలుంగులు దోఁచెఁ దెర దీసినట్లు—
సమ్మోదపూరితస్వాంతుండ నగుచుఁ
జెదరిన ప్రాణముల్ కుదుటఁ బెట్టికొని
యిక్కజాటినగుండె చిక్కఁ బట్టికొని
లేచి నిలువఁబడి చూచి నల్దెసల,
భువి నేఱుపడినట్టి వివరంబుకొఱకు
వెదకులాడితిఁగాని విఫలుండనైతి—

♦ ♦ ♦

కార్యకారణకుతర్కంబు మాని
బహుధా ప్రచలితభావవినిర్మలతకుఁ
దలయెత్తి వినువీథిఁ దిలకించుచుండ,
" స్వర్గానన్నైనఁ దప్పవు విడాకు " లను
ముత్తవ్వ సామెతఁ బొల్లువోనీక
స్వప్నానన్నైనఁ దప్పక వెంబడించి
నను గేలిసేయ మిన్నున నొక్కపక్షి
పఱతెంచె వాగ్గేయవిరచనకేళి ;
నా పక్షి యేజాతి దగునో నే నెఱుఁగ ;
నప్పటి నాపాటుఁ జెప్పఁగానోటు ?

◆ ◆ ◆

అసహానతాభరంబగు తల వంచి
న్యూనమానసమున కూఱటలేక
యేమిచేయుదునని యెంచుచుండంగ
ననవలె ననుకోకమునుపె నానోట
" నాచేతఁగానితనము బైటఁ బడెను ;
మనసుచే నెగురఁగల నెచటి కైనఁ ;
దనువుచే నెగుర నాతరము గాదయ్యెఁ ;
బక్కికెంబలె నాకు ఱెక్కలున్న యెడ-"
అను పూర్వవాక్యము పునరుక్తమయ్యె—
ఉన్నపాటున ఱెక్క లొదవెను నాకు !
ఆకసంబునఁ జూడ నాపక్షి లేదు ;
పక్షయుతుని నన్ను వీక్షించినంత
" వీని నెమర్చుట గానిపని " యని
తనదారి నెటకో పోయినది గాఁబోలు.—

◆ ◆ ◆

నా కోరుకొన్నది చేకూరి యుంట
నతులితానందలోలాత్ముండ నగుచు
నరపక్షి నై యున్న నా స్వరూపంబు
నిలువెల్లఁ జూచికొంటి మనసుదీర-

రవివర్మనిర్మితరమ్యచిత్రస్థ
గరుడరాడ్రూపసంస్ఫురణమై యపుడు
సామ్యసాకల్యవిచారణ మూని
ముక్కుఁ దడవుకొంటి ; బొమ్మలోఁబోలెఁ
బొడవువంకరపోల్కిఁ పొసఁగనే లేదు-
నాసిక పోలకున్నను దక్కువేమి ?
తక్కిన వెల్లఁ జిత్తరువునంబోలె
నచ్చుపడినయట్టు లమరె ననుకొని
మోదవివశత మూఁపులు పొంగిపోవ
నిమురుచుకొంటి నున్నమితహాస్తముల-
అయ్యవసరమున నదియేమొ కాని
శ్రీమహావిష్ణువు చేఁ దాఁక లేదు !
శ్రీపతి రూప మే మూఁపుపై లేదు !!

♦ ♦ ♦

శ్రీహరిదివ్యశరీరభారంబు
మూఁపుపై మోసెదు పున్నెంబులేక,
తద్విగ్రహైకచింతాభారమునను
గుదురేది నెమ్మది క్రుంగిపోయినది ;
శ్రీనివాసుని నునుమైనీలిచాయ
మోమెత్తి దర్శించు పున్నెంబులేక

తన్మూర్తి నీలిమా తన్మయత్వమునఁ,
దెలివేది నెమ్మది కలఁగిపోయినది.

♦ ♦ ♦

అఖిలపురాణేతిహాసంబులందు
విష్ణువాహకుఁడుగా విశ్రుతుండైన
గరుడరాజేడ? నే నరపక్షినేడ?
అని యింత సంకోచమైనను లేక
రెక్కలున్న విఁక నాతక్కువేమనుచు
మిక్కుటంబుగ నిక్కి రెక్క లల్లార్చి
రివ్వురివ్వున నెగిరి దిగంతములకు
వెదకులాడితి మహావిష్ణుని కొఱకు.

♦ ♦ ♦

చిత్పథంబున నుండి చిక్కులం బెట్టి
దృక్పథంబున హరి తెలియరాకుండె;
ఆత్మలోపల నిండె నా రమాధవుఁడు,
బాహ్యలోకము వట్టిబయలుగా నుండె.

♦ ♦ ♦

“ పలుపొగడ్తల కెక్కు నల విష్ణుమూర్తి
యట్టు పుట్టానవాళ్లవి బట్టబైటఁ
జూపట్టువఱకు, నేఁ జేపట్టువఱకు,

నాపట్టు విడకుందు నేపట్టునందు."
కృతనిశ్చయుండనై యీ తెలుఁగునను,
ఆ వాస్తుదేవుని యావాస మెదియొ
పలురీతు లెడఁదలోఁపలఁ దలపోసి
కొనుచునుండ, "అల వైకుంఠపురంబు"
మొదలైన బమ్మెరపోతనామాత్యు
మత్తేభమోక్షణవృత్తాంతవినుత
మత్తేభలక్షణవృత్తంబు దోఁచె–
వైకుంఠపురములో శ్రీకాంతు నెలవు
నిర్ణయింపఁగలేకునికిఁ బోతనకవి
యసమాప్తముగ నిల్పినంతనె పూని
పూరించె నఁట పద్దెము విరించిరాణి–

♦ ♦ ♦

సాక్షాత్సరస్వతీసత్కటాక్షమున,
సహజాతకవితాతిమహిమంబుచేత,
భూయిష్ఠభోగోపభోగియై యున్న
భార్యావినోది కాపన్న ప్రసన్న
తాపాదనంబయ్యె! అదిగదా కవిత!–
ఆర్తరక్షణపరాయణత రూపించు
నా "సిరికిం జెప్పఁ" డను పద్దె మదిర!–

♦ ♦ ♦

" శ్రీమహావిష్ణుమూర్తీ! మనోవర్తి!
నీ వేల రావిందు నా వెట్టిదీర్ప?–
భాగవతోత్తమబమ్మెరపోత
రా జున్న పాటున రప్పించె నిన్నుఁ
దన సహజకవితాతతశక్తిచేత ;
నా కట్టిశక్తియే లేకుంటచేత
దరిసెనం బీయవే? కరుణించి రావె ?
వైకుంఠపురములో శ్రీకాంతతోడ
సరసంబులాడెడు సమయమో యిపుడు?
పోతన్నభక్తికింబోలెఁ గాకున్న
నా బత్తికొలఁదికైనను వత్తువనుచు
నాసపైకొనియుంటి, నది తీర్పవలదె ?"–

♦ ♦ ♦

" సిరికిఁ జెప్ప మడుగఁ జిడిముడిపడదు ;
సంధింపు చేదోయి శంఖచక్రములఁ ;
జీరుము నీ పరివారంబు నెల్ల ;
ఆకర్ణికాంతరమైన ధమ్మిల్ల
మొగయ బిగించి చక్కఁగ నొత్తికొనుము ;
తత్తత్సమయ వివాదప్రౌఢతమగు

శ్రీకుచోపరిపృథుచేలాంచలంబు
పీడకుందువె, సిరి ప్రీడావతిగద ?
సావకాశంబుగానే వత్తువుగద ?–
చెప్పకొక్కటి మఱచితి నందువేమొ ?
మఱచిపోలేదు – నామనసుఁ దీర్చుటకుఁ
బన్నింప కభ్రగపతి నంతెచాలు.”

♦ ♦ ♦

ఇటు వేఁడుకొన్నట్టులే విష్ణుమూర్తి
సకలవివరము లచ్చంబుగాఁ దోఁచె,
బహిరంగముగఁ గాదు బహురహస్యముగ ;
ఎదుటిచూపులనుగా డెడఁదలోపలను–
విష్ణుస్వరూపంబు వేర్వేఱుగతులఁ
గనుమూసికొన్నను గనుపించుచుండి
చిక్కుఁబెట్టుచు నొకఫక్కిగా లేక
మనసుఁగలఁచివైచెఁ, గనుపించ కెదుట–

♦ ♦ ♦

“వైకుంఠనిలయుండు నాకంటఁబడునె ?
పోతన్న రప్పించెఁబో నాకదేల ?
స్వయముగా నెగిరి యుపరిలోకమునకు
వైకుంఠమునఁ గాంతు శ్రీకాంతు ననుచు,

నూర్ధ్వలోకస్థమై యుంట నా పురము,
చదలంట నెగిరితిఁ; దుదికంటఁబడక
విసిగి వేసరిపోయి విముఖుండ నగుచుఁ
బైలోక మొకవట్టి 'మాలోక' మంచు
భూలోకవైకుంఠముగఁ జెప్పఁబడెడు
శ్రీరంగపురమును జేరి, పైపైన
నెగిరి యచ్చటివింతలెల్లఁ జూచితిని

♦ ♦ ♦

ప్రాకారసప్తకప్రావృతమైన
బహుళగోపురమంటపకలితమైన
శ్రీరంగపురము వర్ణింపఁగాఁజాల
కావేరి యీరేరుగా వేఁలుపడుచుఁ
బాఱు నా యూరున కీ రండలందు ;
బహుదేశములవారు, భాషలవారు,
క్షేత్రస్థులగువారు, యాత్రలవారు,
భజనగోష్ఠులవారుఁ, బదమాడువారు,
'రంగా' యనెడువారు, 'రంగేళి' వారు,
దిరుచూర్ణములవారు, దిరుగాడువారు,
నూర్ధ్వపుండ్రములవా, రో! వీరు వారు
శ్రీరంగపురమునఁ జేరియున్నారు_

◆ ◆ ◆

ఆపురం బందునఁ గాపురంబున్న
వారెల్ల వైకుంఠవాసులే, వారి
మంచిచెడ్డలు విమర్శించు టేటి కని,
చంద్రపుష్కరిణిలో స్నానమొనర్చి,
లోని ప్రాకారంబులోఁ బ్రవేశించి
పెద్ద గరుత్మంతవిగ్రహం బొకటి
దర్శించినాఁడఁ; జేత స్పృశించినాఁడ—
ఆత్మస్వరూపు నన్నరసి కాఁబోలు
ననిమేషుఁడై గరుడాళ్వారదేమొ
చలనరాహిత్యత స్తంభించికొనియె—
తన్నుఁబోలెడు నన్ను మన్నింపవేఁడి
నా యాస నెఱవేఱ సాయపడు మని
దండప్రణామముల్ మెండు గావించి,
నా పెక్కు లోరుల కంటఁ బడకుంటకయి
యుత్తరీయము విప్పి యొడలు గప్పికొని,
నడిమి ప్రాకారంబునం బ్రవేశింప,
నేకాంతసేవాసమాకర్షితమగు
జనసమూహ మొకండు గనుపించె నచట—

◆ ◆ ◆

సంకల్పరహితమై స్మారకం బుడుగ,
నప్రేరితముగ న న్నల్లనల్లనను
బదయుగం బాత్మేశు పజ్జను నిలుపం
బ్రకృతిసంస్మృతిని శ్రీపతిపాదములకు
నెఱఁగ నొఱఁగుచున్న తరుణంబునందు,
—“ దేవుండు వరమీయఁ బోవఁ బూజారి
చేటుచు ” నం చనుభవించిరె పల్కు రెవరొ ?—
వడిఁ జొరంబడి యొక వైష్ణవార్చకుఁడు
కసరికొట్టి వెడలఁగా నెట్టి నన్నుఁ,
దెరవైచి విష్ణుండు తెలియరాకుండ
సాంబ్రాణిధూపవాసన గుప్పు మనఁగ
లోనుండి చేసె ఘంటానినాదంబు—
తన పరిమళముచేతను జేరఁబిలుచు
మల్లెపూఁబొదరున నల్లత్రాఁచువలెఁ
బెట్టువానిని జెడఁగొట్టు పున్నెంబు
గట్టికొనుట కింకొకఁడు సిద్ధముగద ?—

♦ ♦ ♦

“ ఆ యర్చకుఁడు న న్నరయ కున్న యెడ
మోకరించికొని మూఁపున విష్ణుమూర్తి
నెక్కించికొని చక్క నీపాటి కేను

బయలు తెంచియుందు దిగ్వలయంబునందు"
నను చనంభవభవిష్యదవలోకనము
నలువు చే నుండ నుత్సవరంగఁ డపుడు
మూలవిరాట్టుని మ్రోలకు వచ్చె ;
నైవేద్య మిడి యనంతర మర్చకుండు
తెరఁదీసి కర్పూరదీపహారతిని
గై సేఁత లొనరించు నాసమయమున
దడదడఁ జేతు లొందల మోడ్చువారు,
పడపడ లెంపపె ట్టిడికొనువారు,
ధణధణ 'రంగనాథా' యనువారు,
గొణగొణ పెదవుల గొణిగెడువారు
గా నుండి రచ్చటఁగలవార లెల్ల-
తృటిసేపుమాత్ర మీదృశ్యంబు దెలిసె-

♦ ♦ ♦

తన్మయానన్యచింతాపరత్వమున
దృక్పరిసారంబున నితరంబు వడక
కర్పూరహారతికళిక యొక్కటియు,
మూలవిరాణ్మహామూర్తియొక్కటియు,
గుడియయ్యె వేర్వేఱఁ గొండొకసేపు.
ఇరు తెఱంగుల నిట్లు గుడిఁగొన్న చూపు.

రంగారు రతనపుటంగీ ధరించి,
పచ్చలపతకంబు హెచ్చుగా మెఱయ
"పల్లాండు పల్లాండు పల్లాయిరాండు"
మొదలైన తమిళపుం బదములం బాడి
సాంగాభినయత నయ్యంగార్లు మోయ
బంగారుపల్లకీపై నధిష్ఠించి,
చేరి యెల్లరు నమస్కారముల్ సేయఁ,
గమ్మనెత్తావులు గమ్మునం జిమ్మ
పచ్చకప్రపుఁబొడి పైఁ గుమ్మరిలఁగ,
వీణాస్వనంబులో లీనమై యున్న
త్యాగయ్య తెలుఁగుకీర్తనముల వినుచు
శ్రీరంగఁ డేకాంత సేవలం గొనియె
ఏకాంత సేవావలోకనావశత
హృదయంగ తేప్సిత స్మృతి దప్పియుండ
గర్భాలయమునుండి ఘంటారవంబు
కనుకులోనుండి మేల్కొలిపె నెమ్మదిని-

♦ ♦ ♦

" సేవలంగైకొను శ్రీరంగఁడితఁ
డుత్సవవిగ్రహం బూరకే యిట్లు
కాలయాపన సేయఁగా నేల యిచట ?

మూలవిరాట్టును బోయి చూత" మని
గర్భాలయంబువంకకుఁ బోయినాఁడ—

• • •

అతలఘుము త్రైపుటంగీ ధరించి,
చిఱునవ్వు మోమునఁ జెక్కినట్లుండ,
సిరి యురంబువయి బంగరుబొమ్మగాఁగ,
వలపలి కై దండ తలదిండు గాఁగ ;
బడగ గొడుగుగాఁగఁ, బాఁపపానుపునఁ
బన్నుండియున్న యాపన్నప్రసన్ను,
శ్రీ రంగనాథు దర్శించి యుప్పొంగి,
—బాహ్యైకాంతసేవా కారణమున
నాలయాంతరమున నన్యులు లేక—
శ్రీకాంతునకు సార్థకైకాంతసేవఁ
గావించి చెంతకు రావించు చింత,
నపుడు " శాంతాకార " మాదిగాయె యున్న
సుప్రసిద్ధం బగు శ్లోకంబుచేత
వినుతు లొనర్చి వే వినతు లొనర్చి
యాటపాటలఁ గొనియాడి వేఁడితిని—

• • •

ధ్యానావధానమైనట్టి మానసము

వినుజాడ నెగిరితి వెనుఁజూడకుండ !—
అంతెయుఁ గూడ నన్యపరోక్షముగనె
జరిగిపోయె నచటి సందడిలోన ;
మూఁపుపైనను నేను మోపికొన్నదియు
మీానంబుగా దల శ్రీనివాసుండె !—

♦ ♦ ♦

వైకుంఠనిలయుని నాకంట నిలిపి,
శ్రీరంగవాసిని జేరంగఁ దీసి,
భుజగశయానుని భుజములం దూని
గరుడగమను నరగమను నొనరిచి
యీాడేర్చుకొంటి నా యీాప్సితం బనుచుఁ,
బట్టు చెల్లె నటంచు బిట్టుబ్బి పొంగి,
పట్టఁజాలనియంతవట్టుఁ దూలిపడి
మోమెత్తి శ్రీవిష్ణుమూర్తి నేఁ గనక,
నోర్విప్పి యొకమాట నుడువఁగాఁ బోక,
యెవరేనిఁ గనిపట్టి రేమొకో యనెడు
నదటున గుండె లిట్టట్టుఁ గొట్టికొన
దొంగిలించినవానిభంగిగా నపుడు
క్రిందు నారయుచు దక్షిణాపుదిక్కునకుఁ
బఱతెంచు తటి సమీాపతలమునందు

జంబుకేశ్వరగోపురంబులు తెలిసె

భూతపంచాత్మకంబులయి వేర్వేఱ

వెలయు నయిదులింగముల నొక్కటి యయి

జంబుకేశ్వరమున జలలింగ ముండు-

జంబుకేశ్వరుని దర్శన మొనరింపఁ

బోవక, పైసాగి కావేరి దాఁటి

తిరుచినాపల్లి యన్పురి నున్నతమగు

మలకోటపై వ్రాలి, యలసటం దూలి

నామూఁపుపైనున్న శ్రీమనోహరుని

ముంగడ నిలిపి ప్రమోదంబు మీఱఁ

దన్మహామూర్తి సందర్శించు నాస,

లీలాస్వరూపు నాశ్లేషించు నాస,

నాగమవాచ్యు మాటాడించు నాస,

వేదాంతసన్నుతు వినుతించు నాస,

నెంతయో యాస, నిం కేమేమొ యాస,

నా కొండపైనను మోఁకరించికొని,

" అవరోహణము సేయుఁ " డని వినయముగ

విన్నవించితి ; వినిపించుకోలేదు ;

చేయూఁత యొసఁగఁగాఁ జేతు లెత్తితిని ;

ఊఁహుఁ ! విష్ణుమూర్తి కే లూననేలేదు ;

క్రమముగ దీపికాకళికలో నిలువ
దివ్యవిగ్రహము జ్యోతిర్మయంబయ్యె;
ఆ పరంజ్యోతిలోఁ జూపు రంజిల్ల
క్షణకాల మాత్ర వీక్షణ లీనమయ్యె;
ఐక్యానుసంధాన మదియె నాకపుడు;
అది యోగులకె కాని యలవడ దంట;
తన్మయీభావత సాధ్యము కాకపోదు
తలఁపుఁగోఁతి కొకింత నిలుకడ యున్న-

♦ ♦ ♦

గర్భాలయంబునఁ గ్రమముగా నపుడు
ధూపదీపంబుల ధూమంబు లలమి
కరడంబు లడరెడు కడలిగాఁ దోఁచె;
పొగలమఱుఁగున మూలవిగ్రహము
నైజవినీలవర్ణము మాటువడఁగ
స్ఫుటముగా లేక విభూతివర్ణమున
నంబుధి నీఁదు మీనంబుగాఁ దోఁచె;
నిలువుటంగీము త్తెముల్లు మెఱుంగీని
మిసమిసచేఁపపొలసులుగాఁ దోఁచె;
ఆమీనుఁ బట్టుట కాస పైకొనఁగ
నపుడు జాలరివాఁడ నైనాఁడ నేను;

సూటియగా నా కనుచూపుఁగోలకును
దుదిఁ గట్టఁబడిన చిత్సూత్రపుం గొసను
గ్రహణేంద్రియము కొంకిగా నేరుపడిన
గాలంబు నాపరికరముగా నుండె ;
కొంకిలోఁ జేఁప దగుల్కొన్నయట్లు
తెలుపంగఁ గర్పూరదీపికాకళిక
సూచికగాఁ జిత్తసూత్రంబు నడుమఁ
గిరణబద్ధంబయి గుఱుతింపఁబడియెఁ
దేలియాడుచు ధూమలోలోర్మికలను ;
కడలిలో మీను నాకర్షించుకొఱకుఁ
జిఱుబత్తియెఱను గ్రుచ్చితిఁ గొంకిమొనకు-
చిటికలో నిటులెల్లఁ జేకూరిచికొని
తేలియాడుచునున్న దీపసూచికను
గనుఁగొను చుండఁగా గ్రమముగా నదియు
నంతర్హితం బయ్యె- ఆసమయమున
జూపుఁగోలయు వంగెఁ జేఁపబరువున-
అద నెఱింగి యపుడే నాకస్మికముగఁ
గోల గట్టిగఁ బట్టి గాలంబు లాగి
చేపడ్డ చేఁపను మూఁపుపై. మోపి,
మెలమెల్ల జాఱి కోవెల వెలుపలకు

◆ ◆ ◆

నిద్రాధికారిణీ! నీ దయవలన
స్వప్నలోకంబులోపలఁ గన్నయట్టి
విషయంబులను గొన్ని వివరించికొంటి
నిన్న శ్రోతగ నిల్పి నే నింతవఱకు ;
ఓపికవట్టు మింకొక కొంతసేపు ;
కొదవవృత్తాంతముగూడ విన్పింతు ;
ఆపైన నీవు న న్నావహించినను
విసుగుచేతను నన్ను విడిచిపోయినను
నీయిష్ట మెటులైన నేఁ గట్టువడుదు-
తావకరాజ్యసంభావితం బయిన
స్వప్నకథన మపూర్వము గాదు నీకు-
కలలోని వృత్తాంతములు గాన నిపుడె
చెప్పకుండిన మఱచెద నేమొ రేపు ;
మననంబునకె నీకు వినిపించుచుంటి-
పుణ్య మేమున్నది ? పురుషార్థ మేమి ?
ఇంతకుం గల గదా ? ఇంతటిదాని
మననంబుచేఁ బ్రయోజన మే మనెదవా ?
వేయివిధములైన వెఱ్ఱులలోన
నిది యొక వెఱ్ఱిగానే యెంచికొనుము-

♦ ♦ ♦

నా కలలోని యంతర్విశేషముల
సావధానంబుగా నాలించువారు
గ్రహియించువారు నీకంటె నా కెవరు ?
నా గోడు విన కనురాగంబుతోడఁ,
బెదవులం జప్పరించెద రన్యులైన ;
పిచ్చికూఁత లని పై పెచ్చు పేర్లిడుచు
నీను పైకొనువాసి లేసుగాఁ ద్రోసి
“ యీ సోదెయే గదా ? యింత దూరంబు
గొప్ప వెడలఁబోసికొనుచుండె !” నందు ;
రైన సరసులు లేరని చెప్పలేదు ;
అట్టివారలఁ జేరు టస్మదాదులకు
సాధ్యపడునె ? యని శంకింప వలసె-
అమ్మ ! నాపైన నీయధికార మెల్ల
గుఱివెట్టి యిపుడు జోఁగొట్ట వల దని
వినయపూర్వకముగ మనవి చేసెదను ;
తరువాతి కథ సావధానవై వినుము_

♦ ♦ ♦

“ వైకుంఠపురము భూలోకమందుఁగల
శ్రీరంగపురమునాఁ జెల్లుట యెట్లు ?–

"స్వామీ! ప్రభూ!" యంటి; బదు లీయ లేదు;
చేతు లాడించితిఁ, జేఁ జిక్క లేదు;
మూఁపుపై భారంబు మొదటనే లేదు;
దారిలో నెచటను జాఱిపోలేదు;
మోమెత్తి చూచితి; నేమియు లేదు ?—
చేజాఱిపోయిన శ్రీపతికొఱకుఁ
గొండగుహాలలోన గుట్టలపైన
వెదకులాడి తుదకు వేసరిపోయి
నా యాస లడుగంటిపోయి డీలుపడి,
మలసిగరంబుపై వెలసియున్నట్టి
యుచ్చవిఘ్నేశ్వరు నొద్దకుఁ బోయి
సాగిలంబడి వేఁడి, నాగోడు చెప్పి,
బోరున నేడ్చితి; మొఱ్ఱవెట్టితిని-
ఓదార్చునట్టు లా యుచ్చిపిళ్లారి
సుప్రసన్నవదనశోభితుం డయ్యె;
ధైర్యముం బూని కర్తవ్యమునకయి
నా మానసప్రపంచము విలోకింప
సంశయావృత్తమై సరిదారి లేక
చక్కనిగతి లేక చిక్కుగా నుండె.
నా సంశయము లెట్టివని యడుగుదువా?

*　　　*

*　　　*　　　*

ఓ తమాలజననీ ! మాతృవత్సలత
జలజల సేసలం జల్లెదు మఱల !-
అస్మదన్వేషితవ్యక్తి చేపడునె ?
పూర్వాపరజ్ఞానము గలదొ నీకు ?-
నీ వెట్లు దీవించినావో యెఱుఁగను ;
నా వరం బదియేమొ నీ వెఱుంగుదువు-
కల యూసుపోకలవలని సందడిని
ఉన్నిద్రతాకారణోపేక్ష లేదు ;
మఱచిపో లేదు ; ఏమఱిపాటు లేదు ;
నీ దీవెనయుఁ బొల్లువో దందుచేత
నా కోరుకొన్నది చేకూరునట్టు
లాశీర్వదింపు ; మయ్యది లభ్యమైన
యప్పుడే నాకు బ్రహ్మానందసిద్ధి-
అప్పుడే నాకుఁ గళ్యాణశోభనము-
నన్ను లేపినవ్యక్తి నాకు నెచ్చెలియె !-

*　　　*　　　*

*　　　*

మునుచూపునందును వెనుచూపునందుఁ
బ్రత్యేకములుగ విస్పష్టంబు లయ్యుఁ
గ్రీఁజూపునను వివరింపఁగాఁబడక
పులుమంగఁబడిన రంగు లనంగఁ దోఁచి
పడమటిదెసకుఁ బర్విడె శీఘ్రగతిని-
నాకుమాత్రము చలనంబు లేదపుడు-

♦ ♦ ♦

ఈ రీతి వ్యోమసంచారంబునందు
మును డాయునవియెల్ల వెనుబోయెఁ గాని,
-క్రీడావినోదిమై కెరలుబాలకుని
చూపునవ్రే ల్తుదిఁ జుట్టఁగాఁబడిన
నిమ్మతాటికొనఁ గట్టఁబడినట్టి గుండు
త్రాటితోడ ననువర్తన మొనర్చుగతి-
అది యేమిచిత్రమో! అపరిస్ఫుటముగ,
అతివినీలంబుగ, అనతిదూరముగ,
నొకపదార్థ మదేదియో చెప్పఁజాలఁ,
గనుచూపునను వ్రేలఁగట్టినయట్టు
లెందుఁ జూచినఁ గాని యందుఁ గన్పించి
కనుదోయి మూసికొన్నను గానుపించి
వడిగ నన్నుడుగక తొడరఁగాఁ దొడఁగె!-

♦ ♦ ♦

నింగిలో నెన్నియేనిం గల వైన
సమవేగ మేకదిగ్గమనంబు గలిగి
యాపదార్థంబు న న్ననుసరించుచునె
నే నెట్టు లరిగినఁ దా నట్టు లరిగి,
నే నాఁగిపోయినఁ దా నాఁగిపోయి,
పంత మూనినభంగి వింత యొసంగె-

♦ ♦ ♦

పరతెంచి పరతెంచి బహుదూర మిట్లు
పత్తనంబులు దాఁటి పల్లెలు దాఁటి
పొలములం గడచి శాద్వలములం గడచి
యొక విశాలమగు నిసుకబైలుపైన
నెగురుచున్నపుడు నుడుగక నాతోడ
ననుగమించునది నల్లని గాటచేత,
నితరంబు లేక శూన్యత నిండుకొన్న
సికతావిభాసితసితకాంతిపైన
నంచలాకారదూరాలోకమునకుఁ
బూర్వపరిచితంబువోలెఁ దోఁపించె-
నైనను నిర్వివక్ష్యముగాఁగ నుండెఁ
బ్రతివివరంబు నేర్పడఁ దోఁపకుంట-

కేవలశిల్పకళావినిర్మితము
గర్భాలయంబునఁగల ఱాతిబొమ్మ
లోకంబులను సాకు వైకుంఠుఁ డగునె?–
ఊహావిరచితమా నొక గాల మొగ్గి
పెనుశిలావిగ్రహంబును బట్టితి నఁట;
కొనివచ్చి యిచ్చోటఁ గోల్పోయితి నఁట;
రెండునిల్వులపొడ వుండు విగ్రహము
మూఁపుపై నే నెట్లు మోయఁ గల్గితిని?
గణనాథుఁ డోదార్చె ననుకొను టేమి?
ఇంతకు వైకుంఠుఁ డెవ్వాఁడై యుండు?
దేవుఁ డంచు మహానుభావుం డటంచుఁ
బేర్కొనఁబడువాఁడు విష్ణువే యగునొ?
ఇతరదైవతరాజి యెల్ల నటుండ,
హైందవనిగమమతావలంబులకు
ముఖ్యంబుగా మూఁడుమూర్తు లనఁబడు
బ్రహ్మవిష్ణుమహేశ్వరత్రయంబునను
విష్ణుప్రసన్నతాపేక్ష నిందనుకఁ
దలఁచితిఁ; దక్క నిద్దఱమాట యేమి?"

◆ ◆ ◆

కట్టుకథవలెఁ జక్కఁగ నింతవఱకుఁ

గడచియుం గడకుఁ దికమకలచేత
సంశయసంచయసంచలిత మయి
శ్రీనీలవర్ణచింతానిమగ్న మగు
భావ మీామొదలగు ప్రశ్నార్థకముల
తావలం బగుటఁ గర్తవ్య మరయక,
" సంశయరహితప్రసన్నాత్ముఁడ నయి
యానంద మే నొందునపు డోగణేశ !
నీప్రసన్నత ఫలించె ననుకొందు " నని
గణనాథునకు నమస్కార మొనర్చి
నడుమంతరపుఁగల్మి మిడిసిపా టూన
నాకసంబున నుంటి ననుకొనక మును పె-

♦ ♦ ♦

క్రిందుచూపులు సాగ ముందు వేవేగఁ
బ్రాగభిముఖుఁడనై పర తెంచినాఁడ-
మేడలు గోడలు వీడువాడలును,
గోటలుఁ దోఁటలు నాటుబాటలును,
జెరువులు దొరువులుఁ జెఱువఱదలును,
జెట్టులుం బుట్టలు మిట్టగుట్టలును,
అవియేల, యివియేల, అగపడ్డ వెల్ల
స్థిరములే యాఁగాక, చరములాఁ గాక,

◆ ◆ ◆

నిర్వ్యవత్స్యంబగు పూర్వపరిచితి
చేరి పరీక్షింపఁ బ్రేరేచు కతనఁ
గ్రమముగా నేఁ బరిక్రమణంబు సేయ
సమముగా నది యథోగమనం బొనర్చి
స్థిరముగా నిలిచె నా సికతాతలమున-
మెలమెల్ల నేను సమీపించునపుడు
పోల్చికొంటిని దాని పూర్వోత్తరముల!
అప్పదార్థ మెదియొ చెప్పికోఁ గలవె?-

◆ ◆ ◆

నిగమసన్నుతునకై నెమకి చుట్టితిని!
నిఖిలలోకేశ్వరునిఁ గనిపట్టితిని!
నీలవర్ణుని యానవాలుఁ గట్టితిని!
నీరజాక్షు నెదుట నిలునఁబెట్టితిని!

◆ ◆ ◆

తొడరుగా నిడునాళ్ళ యెడఁబాటు గలిగి
తిఱిగి దఱియుతఱి నిరువురు చెలులు
బిగికౌఁగిలింతలఁ దగులుకొన్నటులు,
చిక్కఁబట్టికొనుచు శ్రీపతి నేను
లీలాపరస్పరాలింగితాంగముల

నొక్కింతసే వుంటిమో లేమొ కాని
తెలుసంగాఁ దలఁపగా నలవిగాకుండ
జలబిందువులు రెండు గలసికొన్నట్లు
శ్రీపతి నే నొక్కఁ డైపోయినాము!-

◆ ◆ ◆

స్థూలబహిస్సరిశోధనమునకు
నా పూర్వ దేహమే చూపట్టుచుంట,
సామ్యవస్తుద్వయసంగతి లేక,
పరిణామపరిమాణ ములుమడిగాక,
జలబిందువులపోల్కి నసిపడ కుండె-

◆ ◆ ◆

ఆత్మావలోకన మాచరించికొన
నాలోన శ్రీపతిలీల దోఁచినది-
కదనసన్నాహికిఁ గవచంబువోలె
శ్రీపతికిని నా శరీర మేర్పడియె-
వీరుండు దనలోఁ బ్రవేశింపనియెడఁ
గవచంబు దానుగాఁ గదలలేదుగద?
శ్రీపతి లోఁ బ్రవేశింపకమున్నె
ప్రాణధారణము కారణముగా నాకు
బహిరంగచలనంబు సహజమై యుండెఁ;

గానఁ జెప్పెద నుపమానాంతరంబు-

♦ ♦ ♦

మంచినీటఁ గరంగు పంచదారవలె
శ్రీపతి నాలోన లీనుఁడై పోయె-
అనఁగ శ్రీపతివిలీనాంతరంగంబు
మధురపానీయోపమానమైయుండె-
అంబులీనత సహజఁబు చక్కెరకు ;
భావవిలీనత ప్రకృతి శ్రీపతికి-
కరఁగదు చక్కెర ముఱికియా నీట ;
కలియఁడు శ్రీపతి కలుషచిత్తమున-
పంచదార తెలియఁబడక పానకము
వట్టినీరే యను భ్రాంతి గొల్పించు ;
శ్రీపతి కనరాక చిత్ప్రసన్నతయుఁ
గేవలచిత్తభ్రమానవహం బగును-
అగ్నితేజస్తప్తమయి పానకంబు,
స్ఫటికశర్కర పరిస్ఫుటముగాఁ దోఁచు ;
బుద్ధితేజస్తప్తముగఁ జిత్ప్రసత్తి,
శ్రీపతివిశ్వస్వరూపంబు దోఁచు-
శర్కరాస్ఫటిక వాచవు లూరఁజేయు
మధురిమాస్వాదనామహితమౌ రసన ;

శ్రీపతివిశ్వరూపోపాసనమున
లీలాధికానందలోల మా నాత్మ !-

♦ ♦ ♦

" శ్రీపతి, నే " నను రెండు నొండగుట
ద్వైతంబు మాటి యద్వైత మైపోయె !

* * *

ఆ బాహ్యతలమునం దాత్మావలోక
నాయత్తచిత్తుండనై చరించు తఱి,
ద్యోవీథినుండి యేదో నినాదంబు
వినవచ్చె ; నంత దృష్టి నటుమఱల్చి,
నిస్వనహేతువు నిర్ణయింపడక,
ఉరవడిఁ బరికింప నుప్పర కెగసి
నినదంబు వోడము దిక్కునుబట్టి పోవ
ఘంటానినాదంబుగా స్పష్టపడియె-

♦ ♦ ♦

క్రైస్తవులందఱి కాథొలిక్కులకు
క్షేత్రమై పేరుమోసిన వెళాంగణ్ణి
క్రైస్తవాలయగోపురంబులనుండి
కంగుకంగు మనుచు గంటలు మ్రోగె-
వఱుసగానున్న గోపురములు మూఁట

నడిమిగోపురముపైనను వాలినాఁడ
శిఖరాగ్రఖచితమా సిలువచేరువను-

♦ ♦ ♦

మానసాత్యంతచింతానుగుణముగ
సిలువమున్మ్రొక్కన లరసినయంత నాకు
బ్రహ్మవిష్ణుమహేశ్వరస్ఫురణమయి,
ఆ మూఁడుకొమ్మల కాధార మగుచు
గోపురంబున నాటికొని యనంత మయి
వెలయుచున్నట్టి యాసిలువకా లరసి
మూఁడుమూర్తుల కాదిమూల మేమగునో
పరిచింతనము సేయు తరుణంబునందుఁ,
బ్రార్థనగీతాలపనవిశాలమయి
మనసు రంజించు నిస్వన మాలకించి
గోపురంబును డిగ్గి కోవెలం జొచ్చి
యచటివిశేషంబు లారసినాఁడ-

♦ ♦ ♦

ఆరోగ్యమాతృనామాంతరమైన
క్రీస్తుమాత యగు మేరీకన్యబొమ్మ
కెదురుగాఁ గుదురుగా నేకకంఠముగఁ
బాడిరి క్రైస్తవుల్ భక్తిగీతముల-

"విగ్రహారాధకుల్ వీరు గారంట!
కలరు ప్రతిష్టంభకమతమువారు
క్రైస్తవులందు-విగ్రహావిరోధులఁట!
గుడిలేని ప్రార్థన కుదురు నై" ట్లనుచు
నెగసి యుప్పర కుత్తర గమించుతఱిని
దఱికొంటి నొక ధ్వజస్తంభ సంచయము-

♦ ♦ ♦

అదిముసల్మానుల యాత్రాస్థలమగు
నాగూర నెడు పత్తనమున మసీదు-
మీరాఫకీరుగోరీరహించు నట-
ఆ మసీదునకు మహమ్మదీయజను
లరుదెంచి యాత్రార్థులై పెక్కుమంది
గోరీని దర్శించి కొలుచుచున్నారు-

♦ ♦ ♦

"వీరును నిర్విగ్రహారాధకు లఁట!
గోరీని బూజించువారు విగ్రహముఁ
బూజింప రన నేమొ పొసఁగకయుండె-
ఆ సమాధిపయి లక్ష్యము నుంచికాదె
ప్రార్థనాపరులుగాఁ బరగుచున్నారు?-
లోకోత్తరగుణంబులు గలుగునట్టి

వ్యక్తి నేరూపమందైనఁ బూజించు
టది కాదొకో విగ్రహారాధనంబు?—
మనసులో సలుపు ప్రార్థనకైనఁ గాని
గుఱి లేనిపట్టున గుదు రెట్టు లొదవు?—
తలఁపునిలుపని ప్రార్థన నిరర్థకము—
మదిఁ గుదు రొదవించునదియె విగ్రహము—
క్రీస్తొ, మహమ్మదో, కృష్ణుఁడో యెవరొ
లోకోత్తరు నెడఁదలో లక్ష్య ముంచి
ప్రార్థించు టనఁగ విగ్రహపూజనంబె—
కనుచూపునం దైన, మనసువం దైన,
నారంభదశను లక్ష్యస్థాన ముంచి
చలచిత్త మద్దాన నిలిపి సలిపెడు
ప్రార్థనంబగుఁ గాక, భజనమౌఁ గాక,
మానమేయగుఁ గాక, మఱొకటౌఁ గాక,
సారాంశమున విగ్రహారాధనంబె—
ప్రకృతాస్మదీయానుభవకారణమున
విగ్రహారాధనాభిమతంబు గలిగె—
హరిరూపదర్శనైకాగ్రచిత్తమున
విగ్రహారాధనావివశుండ నగుచుఁ
దన్మూలమున నీప్సితంబును బడసి

శ్రీమనోహరలీనచిత్తుండ నైతి ”
నను విగ్రహప్రయోజనయోజనమునఁ
బరతెంచుచుంటి నుత్తరపు దిక్కునకుఁ
బ్రకృతిచిత్రప్రదర్శనలోలుఁడ నయి—

◆ ◆ ◆

“ కడలికడలను వెల్వడి కడల్కొనుచు
‘ జోజో ’ స్వనంబులు శ్రుతిపర్వ మయ్యె !—
వాటమై నీలైన పైఁటచేలముల
నీలిహొరంగులఁ దూలి యూఁగాడు
తెలిముత్తియపుసరుల్ తెల్లమై మెఱయు,
మంగళోత్తుంగతఁ బొంగుసంగతిని
జకితాక్షిమీనంబులకుఁ దృప్తిసంగ,
అలచేడె లదిగో, జోలలఁ బాడి యూఁప
శ్రీలోలునకు సాగు డోలోత్సవంబు !”—

◆ ◆ ◆

“ సెలయేటికెలఁకులం దలికిడి గలిగె !—
ఊర్మికార్భకులతోఁ గూర్మి పేరిమిని
గ్రీడలం గెరలి యీఁదాడి వేడుకను
జలజలోచనుఁ డదె జలకంబు లాడు !”—

◆ ◆ ◆

“ ‘ బేబే ’ రవంబులు వినఁబడు చుండె !-
మందదప్పినగొఱ్ఱె చిందులం ద్రొక్కి
బెదరుపాటునను బురదగుంటను బడి
వెలువడఁజాలమి విలవిలలాడి
కొట్లాడికొనిపోయి కుయ్యిడుచుండె-
ఏసుకుమారసహృదయుఁడే, _ నేల ?-
కఠినాత్ముఁడే జాలిఁ గరఁగి చేయొసఁగు_
సాయపడెదను నేఁ బోయి - నే నేల ?_
ఆర్తరక్షణపరాయణుఁడు శ్రీపతియె
శర ణొసంగెను - గొఱ్ఱె దటి కెక్కె నదిగో ! ”-

♦ ♦ ♦

“ అతివిశాలాంతరిక్షావకాశమునఁ
జప్పటల్ చఱచిన చప్పుడు వొడమె !-
చఱచఱం బరతెంచు గరుడాళి సరస
ఖగవాహనుండు చేరఁగఁ బిల్చు నన్ను ! ”-

♦ ♦ ♦

“ చేరఁ బోవుద మన్నఁ జిత్రం బి దేమొ !
లతికాంగనలతోఁ విలాసంబు మీఱ
డాఁగిలిమూఁతలాటల నాడు చుండె
వనమాలి యుద్యానవనమునం దదిగో !”-

◆ ◆ ◆

" ఇంతలోవచ్చి యీ యిసుకతిన్నెపయిఁ
గూర్చుండి పిల్లనగ్రోవి యూఁదుచును
గోపరీవృతుఁ డయ్యె గోవిందుఁ డదిగో !"–

◆ ◆ ◆

" మాయురే, యెంతటి మాయావినోది !
ననుఁ జూచుకొనినంత నాలోనఁ దోఁచి,
వింతగా నింతలోఁ జెంతనున్న హరి,
యేదారిఁ బోయెనో, దాదాలనుండి
పఱుగుపఱుగున నిత్తటి వచ్చె నిదిగో !
' ఎప్పట్టునను వీడి తప్పించికొంటి
వోయి దొంగా ! రమ్మిఁకేయుండఁ బోక
నాకడ నుండు మిదే కౌఁగిలింత !"–

◆ ◆ ◆

" ఎవతె యీవిశ్వమోహిని ?–విష్ణుఁ డేడి ?–
అమ్మ ! మన్నింపు నాయపరాధమునకు ;
ఇదె నీపదంబుల కెఱఁగుచున్నాఁడ–
ఆఁ ! !– నాల్గుమొగములా ? –అబల యేమాయె ?
నలుమోములాతఁ డనఁగ బ్రహ్మ కాఁడె ?–
సృష్టికర్తకుఁ బ్రదక్షిణ నమస్కృతులు–

సగము చుట్టితి-మూఁడుమొగము లేమయ్యొ?-
మూఁడుకన్నులు గల మొగ మొండె కలదు!-
బ్రహ్మ కాఁడొకొ?- మహేశ్వరుఁడో యితండు?-”

♦ ♦ ♦

“ఇది యేమి?-శూన్యమా?-ఏమియు లేదె-
బహువిధవిభ్రమావహదృశ్యచయము
హరితోడ మొదలయి హరునితో ముగిసి,
పర్యవసాన మాశ్చర్యంబు దోఁప,
శూన్యమై సర్వసామాన్యమై యుండె!-
ఈశూన్యవిస్తృతాకాశంబునందు
నెదియుఁ గన్పడకుండె నేనైన లేక-
ఏమియు లేనిదై యెల్లెడ నిండి
సుప్రసన్న మగు నీ శూన్యాంబరమున
కాదిమూలముగాఁగ నమరెఁ జిత్తంబు-
చేరి వేఱుగఁ దోఁచెఁ జిత్తు నంబరము”-

♦ ♦ ♦

మిన్నునం దీరీతి నన్ను నే మఱచి
యెందులకో కాని యెగురుచున్నపుడు
నిదురరాణీ! నాకు నీదయవలనఁ
బొడమిన తెక్క లొక్కెడ మాయ మయ్యొ!-

ఎవరిచేతనో త్రోపుడువడిన గతిని
గొబ్బున నిలపైనఁ గూలి నిల్చితిని-

*　　　　*

నటరాజమూర్తి రత్నసభాంతరమునఁ
జిన్మయానందంబుచేఁ దాండవింప,
నగుమోము దోఁపఁ బన్నగతల్పమందు
గోవిందరాట్సుభాంగుఁడు పవ్వళింప,
నితర దేవాలయతతి చుట్టికొనఁగ
నడుమ నెలకొని పొందళుకు లొలికెడు
నొక గోపురద్వారముకడ నిల్చితిని-

♦　　♦　　♦

ఎదుటఁ గానఁబడిన దేమనఁ గలను ?-
పాంచభౌతికములై వఱలు లింగముల
నాకాశలింగంబు నా నొప్పునట్టి,
యేమియులేక రహిఁగొలుపునట్టి,
అతినిగూఢమగు రహస్యంబు దోఁచె-
ఆరహస్యం బిట్టిదని చెప్పఁ జాల ;-
'చిత్తు' 'నంబరము' ను జేరి వేఱుపడు
సంధి నుండఁగ నేను, సాక్షాత్కరించె
నైక్యానుసంధానమై "చిదంబరము" !-

♦ ♦ ♦

ఆ చిదంబరములో నతివిచిత్రముగ
నవతారపూరుషు లగపడినారు ;
ముమ్మూర్తులను విశ్వమోహినిఁ గంటి ;
పితృపాదగురులు దీవెన లిచ్చి చనిరి ;
ఏసుమహాత్మప్రభృతులో తెలిసిరి ;
నే నుండుచోటను లేను గాఁబోలు
నాత్మరూపముఁ గూడ నరసితి నందు ;
సచరాచరపదార్థనిచయంబు తెలిసె ;
నిగమాగమంబులు నిఖిలంబుఁ దోఁచె ;
ము న్నెఱుంగని వింత లెన్నియో తెలిసి
కడ కన్నియునుగూడఁ గలిసిపోయినవి !—

♦ ♦ ♦

సర్వసమ్మేళనాసారూప్యమైన
ప్రకృతిలీలావిచిత్రము గోచరించె ;
ఆలీలలోఁ దేలి యానందముునను
మఱచితి నేను నితరమును గూడ—
' అహామన్యము ' లస్మృతి రహితమైనంతఁ
బ్రకృతిచిత్రపటయవనికాంతరమున
స్ఫుటముగా నస్ఫుటంబుగఁ బ్రసన్నించెఁ

దెగ తెంపులేక దేదీప్యమానమగు,
మొదలుతుదలులేక మూర్తిమంతమగు
నోటిమాటలచేత నుడువరానిదగు
నొక పరంజ్యోతి – కా, దొక దివ్యమూర్తి–
కా, దక్షరోంకారనాదంబు – కాదు,
ప్రణయస్వరూపము – కాదు, ప్రళయోగ్రశక్తి–
జౌను, గా, దిది, యది యనరానియట్టి
అద్వయానందలీలావతారంబు !!–

◆ ◆ ◆

అటు చిదంబరవిహారానందమూర్తి
జాడలు దోఁపంగ సంభ్రమంబునను
జతన మొనర్పకయె తమంతఁ బొడము
పలుకు లాడితి నిట్లు స్వాగతం బొసఁగి–

◆ ◆ ◆

“ ఆదితేజోమూర్తి ! ఆలింగనంబు !
ఆశ్రితావనమూర్తి ! ఆనందనంబు !
ఆగమాంచితమూర్తి ! ఆదరణంబు !
ఆనందమయమూర్తి ! ఆత్మార్పణంబు ! ”

◆ ◆ ◆

అంత ?– ఆఁ ?– ఆపైన ?– ఆతరువాత

జరిగిన దేమొకో ?_ మఱచిపోయితిని-
స్వప్న ప్రవేశమువలె నిష్క్రమణము
నిర్ధారణముసేయ నేఱకున్నాను-
పిదప న న్నెవరో లేపిన దెఱుంగుమన_

♦ ♦ ♦

“ ఓయి ! -లే-లెమ్ము !- ఏమోయి !_ మేల్కొనుము-
ఇంకను గుసుకుపా టేల ?- లే లెమ్ము_
అర మోడ్పుఁగను లింక నెఱవిచ్చి కనుము_
మెలఁకువ వచ్చెనా ?_ తెలివొంద వేమి ? ”
అను మేలుకొలుపులు వినినట్టు లయ్యె ;
లేచి నెమకితిని _ లేపిన దెవరో ?_

♦ ♦ ♦

కలకథఁ దుదిముట్టఁ దెలిపికొందమనఁ
జివర నొకింత కొదవ యేరుపడియెఁ,
గలమెలఁకువలకుఁ గలయికవలన_
నా కలగాథ సాంతముగ నీ కెఱుక ;
నా మెలఁకువయుదంతము నీకె యెఱుక_
కలఁగూర్చి, నా మేలుకొలుపునుగూర్చి,
కొదవలే దనిపింపఁ గద వమ్మ ! నిదుర !

♦ ♦ ♦

నెమకులాటవలని శ్రమవాయునటులు
విశ్రాంతి యొసఁగి యీవేదికమీఁద,
ఉపచారములు పెక్కు లొనరించి నాకు,
శుభ మేదొ రానుంట సూచించు రీతిఁ
బొడిసేసలను జల్లి పొన్నమ్మతల్లి,
వెదకనీ కునికి, లేపిన దెవ్వ రగునొ
మనసులోననె తిరుగమరుగ వైచికొను
నను మదినైన యోజనసేయనీక,
కనుమూయఁబోతి గదె? నిదురరాణి!
ఇట్లు మీ రిరువురు నేకీభవించు
టేదొ పన్నికమీఁదనే యనుకొందు-
ఏమైన నామంచికే యనుకొందు-
పొన్నతో నున్న నే నన్నయట్టులుగ
నామె యక్షతలు కల్యాణప్రదములె-
నన్ను లేపిన వ్యక్తి నాకుఁ జేపడుటె
వైభవకళ్యాణశోభనావాప్తి-
చేకూర్పఁ గదరమ్మ! నాకు నెచ్చెలిని-

♦ ♦ ♦

అబ్బ!- జిగురలందినట్లు చిక్కఁబడె
జెప్ప- లాహా!- ఈవిజృంభణ మేమి?

ఎంత స్వార్థపరతయే నీకు నిదుర ?–
కలఁ జెప్పుకోనీయఁ గలదాన విపుడు
వ్యవధి యీకుంటి వన్యవిషయమునకు–
నిను మీఱుటకుఁ బ్రయత్నించెదఁగాక !–

*          *          *
     *          *
          *

౮

—: వెన్నెల :—

◆ ◆ ◆

కునుకువోఁ గనుఱెప్పలు నలిమికొనఁగ
మెఱుపునం బోలెఁ జూపు మిఱుమిట్లు గొనియె ;
మును వెలుం గున్నచోటను జీఁకటి యయి
చీఁకటిచోటఁ దోఁచెఁ దెలివెలుఁగు–
ఛాయాచిత్రపటంబు దీయఁగాఁబడిన
ప్రతిబింబముద్రణాఫలకంబునందుఁ
దెలుపు నలుపుగాఁగ, నలుపు తెలుపుగఁ
గనిపించుగతిఁ దోఁచె క్షణమాత్ర మదిర !
యెదుటిదృశ్యంబు ప్రకృతివికృతముగ–

◆ ◆ ◆

ఔర ! ఎంతటి మనోహరనికుంజమిది !–
గొడుగువిప్పగ నొప్పి యెడలేక కప్పు
నిమ్నోన్నతాంబరనిబిడశాఖాళి !–
అరనెఱి విరిసి దొంతరబంతులైన
సురుచిరతారకాసుమవితానంబు !–
తన పరువుబరువున నిలుకు వంగు

శాఖావిలంబితశశిబింబఫలము !—
ఎలకొమ్మరెమ్మలఁ దొలిచెస నలరు
నవ్యోదయారుణనవపల్లవములు !
అల్లిబిల్లిగఁ గొమ్మలం దల్లికొనిన
ఘనశకలనికాయఖగనికాయములు !—
మొదలు తుదలు లేక, మూలంబు లేక,
పొదలుకొన్నట్టి యీ పొదరింటి నడుమఁ
బలకరాతిన్నెపైఁ బన్నుంటిఁ గాని,
యిదిమనోజ్ఞం బగు దృశ్యమే కాని,
లేకుండె నానందలీలానుభవము
నెచ్చెలి చేపడని కొఱంతవలన—
అదనుగాఁ గనులపై నిమురపెద్దను
యొంటికా లిడి సల్పుఁ గుంటినర్తనము—

♦ ♦ ♦

కనుఁ గ్రమ్మికొని యుండఁ గనుకుఁజీఁకటులు,
కలవెన్నె లొసఁగి యాశలు నిండిపోవఁ,
చలి వొసంగినవేల్పు నెల మాయ మగుటఁ
గల వెన్నెలతెలి వాశలఁ బాయుచుండ
నరతెలివి యుషస్సు నంటిపట్టికొని
యుడివోక పూర్వాశఁ బొడమె రాగంబు—

కనుకుఁజీఁకటులలోనను మేలుకొలుపు
లోకకల్యాణప్రభాకరమూర్తి,
నిఖిలైకమిత్రత నెఱపు నెచ్చెలియె
కాలక్రమమున సాక్షాత్కార మొసఁగు !–

♦ ♦ ♦

ఏదో యొక యపూర్వనాదంబు సుతిగ
మేళగించి విహంగజాలంబు లవిగో !
నింగిలో నొనరించు మంగళధ్వనుల,
భవితవ్యకల్యాణవైభవంబునకొ ?–

♦ ♦ ♦

ఈ నాద మేమి ? – ఇదే చిదంబరము !–
జాగ్రత్సుషుప్తుల సంధి –స్వప్నంబు–
ఏ మనుచున్నాను ?– ఏమినాద మిది ?–
నీవు నాలోనను నేను నీలోన–
కల్యాణమా ?– –కలగాదు– –ప్రణవము
మెలఁకువలోఁ గల !– కలలో మెలఁకువ–
పుష్పవర్షము– పౌన్నమువైదు– –వహూహా !–
ప్రణవనాదమె వినఁబడునది–రమ్మొ !–
స్వాగతము చిదంబరానందమూర్తి !–
ఆదితేజోమూర్తి ! ఆలింగనంబు !–

ఆశ్రితావనమూర్తి! ఆనందనంబు!_
ఆగమాంచితమూర్తి! ఆదరణంబు!
ఆనందమయమూర్తి! ఆత్మార్పణంబు!_
నీవె లేపితి వని నేనెఱింగితిని_
నీవె నేనని నేఱిఁగియపుడె - ఔను_
నీవు నే నొక్కటై 'యీవే' సకలము-
తిమిరంబు దొలఁగెను _తెలివి గలిగెను_

♦ ♦ ♦

నెచ్చెలీ!_ నెచ్చెలీ!_ నీవటే?_ నీవ?_
నాముద్దునెచ్చెలీ!_ నామనోధనమ!_
ఎవ్వరో యనుకొంటి; నీవే సకలము_
శ్రీమచ్చిదంబరాంచితదివ్యరాగ
సముదయజ్ఞానతేజఃప్రభామూర్తి!_
శ్రీమద్వినిర్మలచిత్సభామధ్య
నాదలీలానందనటనాత్మమూర్తి!_
నీవె నా సకలంబు; నీవె నెచ్చెలివి;
నిఖిలైకమిత్రత నెఱపు నెచ్చెలివి;
స్త్రీ పుంసమానతఁ జెల్లు నెచ్చెలివి;
తోడునీడఁగఁ గూడిమాడు నెచ్చెలివి;
పొన్నపున్నెమున నా ముద్దునెచ్చెలివి;

మన సమావేశసమయ మిప్పటను
మనసార నిన్నుఁ గైకొనినాఁడఁ గాన
మంగళకల్యాణరంగ మీ ప్రకృతి !-

◆ ◆ ◆

ప్రకృతిచిత్రాంతరంగస్థలమున
నా జీవితాంచితనాటకంబునకు
నుత్తమపాత్ర వీ, వుపపాత్ర నేను-
స్వప్నభాగప్రదర్శనమగువఱకు
విరహాతాన్వేషినై చరియించు నన్నుఁ
దెరచాటుగా నుండి మురిపించినావు-
విప్రలంభము లేక, విరహంబు లేక,
ప్రకృతోత్తరప్రదర్శనరంగములను
జాగ్రద్విభాగంబు చక్క- నడుపుము-
నాటకాంతోపసంహారరంగమున
నైక్యానుసంధానతాధికానంద
లీలాసుషుప్తిలోఁ దేలింపఁ గదవె ?-

◆ ◆ ◆

ఇవిగో ! కన్గోయి నశ్రువు లొల్కుచుండె !-
నెచ్చెలీ ! యివి కావు నీటి బిందువులు-
చెలిమికలిమి నీదు చేపట్టుబలిమిఁ

బూర్ణచిత్రకలశంబు తొణఁకులాడ
నంచులం దొరలి స్రవించుచున్నట్టి
ప్రణయాతిమధురమరందబిందువులు !—

♦ ♦ ♦

శశిరాగమోదయశాద్వలంబునను
మంచుముత్తియముల మాదిరి దోఁప
నీ యోగమముచేత నెచ్చెలీ! యివిగో
చెమ్మటచుక్కలు గ్రమ్మె నెమ్మేన—

♦ ♦ ♦

శీతలానలసమాశ్లిష్ట మైనట్టి
మేఘమాలికలోన మెఱుపులువోలె
నీకౌఁగిలింత చే, నెచ్చెలీ ! యివిగో
పులక లొదవి తనువునఁ బ్రాఁకుచుండె—

♦ ♦ ♦

భావసరోవరపరిపూరితమగు
ప్రణయరసంబు వెల్వడఁబోవు వడిని
మొగముదాఁని గొంతుముడి మరమూఁత
మొగదిగంబడి యడ్డుదగులుచు నుండఁ
బ్రక్కసంబుల నురవడిఁ జొరంబడుచు
వాక్ఫేనమాత్ర మివ్వాలఁ బొంగిపాఱె

ధ్వనివిశేషంబు లేర్పడ రస మూఁదు-
ఈ గుల్లనుఁడినరుం గేటికిఁగాని,
భావసరస్సులోపల హంస వగుచు
లీలావిలాసత నోలలం దేలి
రహిఁగొల్ప నెచ్చెలీ! విహరింపు మెపుడు-

♦ ♦ ♦

నన్ను లేపిన వ్యక్తి నా నెచ్చెలి యని
పొన్నతో నన్నది పొల్లుపోకుండ
నెచ్చెలిగనె ప్రసన్నించి నా కిపుడు
తిమిరంబు దొలఁగించి తెలి వొసఁగితివి
నీకంటె నాకింక నెచ్చెలి యెవరు ?
వలసినప్పుడు సాయపడు చెలియె చెలి-

♦ ♦ ♦

నెమ్మది నెలకొన్న నినుఁ గాంచలేక
ఆలయము లని, దివ్యస్థలము లని,
మఠము లని, భజనమందిరము లని,
మునుఁగుట లని, నోము లని, పూజ లని,
యింక నేమేమొ యనేకవిధముల,
ఒడినున్న బిడ్డకై యూరెల్ల వెదకు
తల్లిపోలికఁ, దల్లడిల్లిపోయితిని-

◆ ◆ ◆

ఎట్లుకోరిన నట్టులే యుండు నిన్ను
నెవ రెట్టినామంబు లిడి పిల్చికొన్నఁ
బ్రణవాంతరంబయి ప్రణయార్థకమగు
‘ నెచ్చెలి ’ యనుపేర నేఁ బిల్చికొందు—

◆ ◆ ◆

పిలిచికొని నిను నెచ్చెలి! నోరునిండఁ,
బొగడికొని త్వదీయసగుణనిర్గుణతఁ
దలపోసికొని మన బలితంపుఁ జెలిమి
వెలిఁగింతు నాదు జీవితతామసంబు.

◆ ◆ ◆

మనయున్కి—, మనమన్కి—, మనచెల్మిపూన్కి—
యింతట నంతట నంత మైపోవు—
ఈనాఁటివారమే యీ వేను దలఁప?—
పరగింతు నిఁక మౌనవాగ్గీతములను—

◆ ◆ ◆

నీనామమయమౌట నెమ్మనం బిపుడు,
నీనాదమయమౌట నెమ్మనం బిపుడు,
నీమూర్తిమయమౌట నెమ్మనం బిపుడు,
నీకళామయమౌట నెమ్మనం బిపుడు,

త్వన్మయానందతన్మయాకారణమున,
బలు కాడఁబోవ నవ్యక్తమై పోవుఁ ;
బాట పాడఁగఁబోవ స్వరమేళ మగును—

♦ ♦ ♦

ప్రణయ ప్రణవపరస్పర మేళనమున
శాంతవచోవికస్వర మేళనమయి
నీలోన లీనమై నెచ్చెలీ! నేను
ఓఒఒఒఒఒఒఒఒఒఒఒ (మ్ ?)

—: ఓమ్ ! :—

# సవరణలు

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 11 | సమీరస్పర్శనము | మలయమారుతంబు |
| 7 | 10 | గాని | కాని |
| 8 | 15 | కుంకితు | కుంకింతు |
| 9 | 19 | గాన | కాన |
| 10 | 17 | గాని | కాని |
| 20 | 5 | గాని | కాని |
| 24 | 3 | నీప్సితంబులీడేఱు | నీప్సితార్థములెల్ల నీడేఱు |
| 26 | 6 | బట్టకొని | బట్టికొని |
| 27 | 8 | నాకు | నాకె |
| 31 | 7 | బీయవే ? | బీయవో ? |
| | | కరుణించిరావె ? | కరుణించిరావో ? |
| 34 | 10 | రాహిత్యత | రహితుఁడుగా |
| 40 | 14 | చుండఁగా గ్రమము | చుండఁగాఁ గ్రమము |

